# కవితా చంద్రిక

(గేయకృతి)

రచన

'కవిరత్న'

నీలా జంగయ్య
హైదరాబాదు.

ప్రకాశము
శ్రీదేవి పబ్లికేషన్స్
H. No. 2-1-527/7
నల్లకుంట, హైదరాబాదు:

ప్రతులు : 1000

నవంబరు 1980



మూల్యము : **5-00**

ముద్రణ : ఇందు ప్రింటర్స్, హైదరాబాద్,

ప్రతులు - లభించువారు

కాకతీ పబ్లికేషన్, నారాయణగూడ, హైదరాబాద్.

దేశీ బుక్ హౌస్, నారాయణగూడ, హైదరాబాద్.

శ్రీనివాస బుక్ సెల్లర్స్, నల్లకుంట, హైదరాబాద్.

# పీఠిక

కమనీయ కవితా సుగంధమ్ము సృష్టించి
పలుకు సుమమ్ముల తళుకు లేర్చి.
పరిసర ప్రకృతి సౌభాగ్యంబు వీక్షించి
శోభల సమకూర్చి సుధల జేర్చి
మహనీయ గుణగణాత్మకము లౌ ఘటనల
కథల జోడించి శంకలను దీర్చి
జీవ కల్యాణ రాజీవమౌ రసరాజ్య
భూములందానందముల వెలార్చి

సుకవి వాసించు సద్గ్రంథ సుమధుర ప్ర
కాశమానంబుగా శశికళలనిండి.
అమృత హృదయంబు తోడైన నదియుగావె
పరిమళానంద గతినొందు పసిడియట్లు.

నెనరు (దయ) ఉంటేనే ఎటువంటి పరిస్థితిని అర్థం చేసుకొని, తననుంచి కావలసినంత లేదా చేయగలిగినంత సహాయం చేయడానికి వ్యక్తి సహకరిస్తాడు. ఆ వ్యక్తి మూలంగా సంఘం బాగుపడుతుంది. బాగుపడిన సంఘంలో వ్యక్తి జీవితానికి రక్షణ ఉంటుంది. కవులు - కళాకారులు ఈ భావనలో జీవించినప్పుడే ప్రకృతి నవ్వుతుంది వాసనలు వెదజల్లుతుంది, మధుర మకరందాలు సందిస్తుంది. మానవులంతా కవి పండితులేకాని కొందరు గ్రంథాలు వ్రాస్తారు, మరికొందరు వ్రాయరు. ఆ వ్రాసిన వాళ్ళల్లో తేడా

లున్నట్లే రచనల్లో కూడా భేదాలుంటాయి. ఈ వైవిధ్యం అన్ని విషయాలలో ఉంటుంది. గుణాల భేదాలతో వ్యక్తి కర్మ ప్రతిఫలిస్తుంది. ఈ గుణాలనుబట్టే విలువ లేర్పడతాయి. ఒకడిని మహాకవి అంటాము. ఒక గ్రంథాన్ని మహాకావ్యమంటాము. అందులో తద్గుణ సంపద అధికంగా ఉంటుందన్న నిర్ధారణతోనే.

"విద్యలందెల్ల నుత్తమ విద్య కవిత
దాని నెరుగుట విశ్వమంతయును గనుట"

అని అప్పకవి అన్నాడు. అందుకే ఏ జాతిలోనైతే చక్కని కవితారాధన సాగుతుందో ఆ జాతి నాగరికత కలదై తోయజ మకరంద భాసురమై అలరారుతుంది.

వేదాలు ప్రభు సమ్మితాలు
పురాణాలు సహృదయ సమ్మితాలు
కావ్యాలు కాంతా సమ్మితాలుగా

చెప్పబడుతున్నాయి. ఉదాత్తమైన ఇతి వృత్తంతో కావ్యాన్ని ప్రతిభావంతంగా నిర్మించినవాడే కవి అవుతాడని సాహిత్య లక్షణ గ్రంథాలు ఉద్ఘోషిస్తున్నాయి. వైశేషికాది గ్రంథాలు అనుమానాది ప్రమాణాలతో ఈశ్వరుడున్నాడని ప్రశంస చేసినాయి. ఉపనిషదాది వేదాంత గ్రంథాలు పరబ్రహ్మను ప్రతిపాదించినాయి. అట్లాగే భారత రామాయణాది కావ్యాలు పురుషోత్తములైన కృష్ణ రామాదులను అభినుతించినాయి. నాయకుని గుణ మహిమతో కావ్య గౌరవం ఇనుమడించినట్లే కవితా గౌరవమూ కవి ప్రతిష్ఠయూ ఇనుమడిస్తుంది.

"అపారే కావ్య సంసారే
కవిరేవ ప్రజాపతిః" అన్నారు.

ఎప్పుడా వైదుష్యంలో కవి, బ్రహ్మతో పోల్చబడినాడు యుక్తమైన కవులచే కావ్యాలు ఉదయిస్తాయి. 'కలివేళ సుకవిజనులే మోసులు,' అన్నాడు అప్పకవి. ఈనాడు మనం డబ్బున్నవాళ్ళని గొప్ప చేస్తున్నాం. అధికారంలో ఉండే వాళ్ళ గుణహీనుల్ని సైతం ప్రస్తుతి స్తున్నాం. పదవి పొందడానికి పచ్చగడ్డిని సైతం తినేస్తున్న వారిని గని గాడిదలు విరోధం ప్రకటిస్తున్నాయి. ఎంగిళ్ళు నారగిస్తున్న వారిని చూచి కుక్కలు విలపిస్తున్నాయి. ఏం చెప్పాలె ఒక కవి సమ్మేళనంలో కొందరు కవులు తమకు నచ్చిన కవితా ఖండికల్ని గానం చేస్తారు. సభలో చప్పట్లను కొట్టే జనాన్ని పోగు చేసుకొంటారు. ఆ తెల్లారినుంచి నేను మహా కవినని అధికార్ల దర్శనం చేస్తూ పదవులనో బిరుదులనో సమ కూర్చుకొంటూ అవి పొందకుండా ఉన్నవాళ్ళని హీనంగా భావిస్తాడు. సౌందర్యం పోటీలో సుందరిగా నెగ్గిన అమ్మాయిని పెండ్లాడినవాడు ఆ మర్నాడే ఎందర్నో అపు రూపవతుల్ని చూసి ప్రపంచ సుందరిగా ఎంచుకొన్న తన భ్రమను తొలగించుకొని ప్రచారం సరుకును స్వీకరిం చడంలో మోస పోరాదను కొన్నాడు.

ఎచట సుకవులు జనులచే నెన్నబడియు
గౌరవములంది నిలుతురో వారి వలన
లోక గౌరవమేర్పడి నాక సదృశ
జీవనానందము బొంది వెలగు జనము

అనే ఈ నా పద్యం సత్యం వక్కాణిస్తుంది. రాజాదరణ ఉంటేనే కవిత్వం బతుకుతుంది అనేది నిజం కాదు. అన్న సత్యాన్ని వేమన్న, పోతన్న, త్యాగయ్యలు నిరూపించినారు. ప్రజాదరణ ముఖ్యం. సత్యజీవన మతి ముఖ్యం, త్యాగం సర్వోన్నత మయింది. నేను గొప్ప కవి ననుకొనే వాడల్లా కృతిని సాక్ష్యంగా నిలుపక తప్పదు.

కళాకారుల్లో ఈర్ష్యాసూయలు పరస్పర ద్వేషాలుంటా యంటారు. ధర్మరాజును అజాతశత్రు వంటారు. తనను తా జయించబడక ఏ పరిస్థితిని వశ్యం చేసుకోవాల దన్నది నిజం. జాతికి కవులకన్నా భక్తులే ఎక్కువగా ఉపయోగపడినా రన్నది నిజమని తోస్తుంది.

నాలుగేండ్ల క్రితం ఈ గ్రంథం శ్రీ కర్నాటి లింగయ్యగారికి అంకితం ఇచ్చాను. ఆ వాగ్దానం నాచే నెరవేరుతున్నదన్న ఆనందం నాలో పొంగులెత్తుతుంది.

పాఠక లోకంలో ఈ గ్రంథం ఏ మాత్రం తృప్తిని కలిగించినా అది నా కవితా లక్ష్మికి ప్రతిష్ఠాకరమవుతుంది.

ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించిన ఓంపు ప్రింటర్స్ వారికీ, పాఠకులైన మీకూ కృతిని స్వీకరించిన శ్రీ లింగయ్య గారికి నా ప్రత్యేక వందనములు అర్పిస్తూ విరమిస్తున్నాను.

మీ

సిలా జంగయ్య

హైదరాబాదు
25-11-1980

# కృతిపతి

## శ్రీ కర్నాటి లింగయ్య ఎం.ఎ, ఎమ్.ఫిల్. గారి పరిచయము

ఆంధ్ర సారస్వత లక్ష్మికి రత్న మందిరాన్ని నెలకొల్పి కృతి సౌందర్య నీరాజనా లిచ్చిన సర్వజ్ఞ సింగభూపతి కాలంలో విశ్వవిఖ్యాత భాసురమై అలరిన నల్లగొండ మండలంలోని నరసింహాపుర గ్రామ వాసులైన కర్నాటి వెంకమ్మ చెన్నయ్యగార్ల నోములపంటగా 10-6-1944 న శ్రీ లింగయ్యగారు జన్మించినారు. ఏకైక పుత్రుడుగా వర్ధిల్లిన వీరి విద్యాభ్యాసం ఉన్నత పాఠశాల వరకు చండుపట్లలో జరిగినది. నాగార్జున కళాశాల నల్లగొండలో **B.A.** వరకు చదివి, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర విషయకంగా 1972 లో **M.A.** పట్టాన్ని స్వీకరించారు. ఆ సంవత్సరమే విద్యాశాఖలో అర్థశాస్త్రోపన్యాసకులుగా నియామకులైనారు. ఇచ్ఛికాంశమైన అర్థశాస్త్రంలో ఎం.ఫిల్. డిగ్రీని 1977-78 లో పొందినారు. ప్రస్తుతం "నిజామాబాద్ జిల్లాకు చెందిన శక్కర్ నగర్ పంచదార పరిశ్రమకు సంబంధించిన - ఉత్పత్తులు - విలువలు" అనే అంశంపై పరిశోధన (**Ph.D**) చేస్తున్నారు.

ఉన్నత విద్యాభ్యాసంతోపాటు కళాశాల ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తూనే శ్రీ లింగయ్యగారు సాంఘిక సారస్వతాది రంగాలలో పరిణత గుణ సేవితులుగా విరాజిల్లుతున్నారు. వాసవీ సాహిత్య పరిషత్తునకు, మరియు తాను నెలకొల్పిన 'నందనవనం' సాహితీ సమితికి ప్రధాన కార్యదర్శులుగా ఉన్నారు.

ప్రేమశీలి, స్నేహపాత్రుడు అభ్యుదయాభిలాషులైన శ్రీ లింగయ్య గారు కవిగా 3 గ్రంథాలు రచించి, సర్వాంధ్ర కవి పండితుల మన్నన లందుకొన్నారు. ఈ నా కృతి 'కవితా చంద్రిక'ను మిత్రునిగా భావించి అంకితమిస్తున్నాను. సర్వేశ్వరుడు వారిని దీర్ఘాయుష్మంతునిగా వర్ధిల్ల చేయాలని ప్రార్థిస్తూ ముగిస్తున్నాను.

రచయిత.

# అంకితము

మిత్రులు ! స్నేహపాత్రులు !

సౌజన్య పవిత్రులు !

అనుపమగుణ విద్యా పవిత్రులు !

సత్కవితాగ్రంథ రచనా చరిత్రులు !

ఆత్యున్నత విద్యా బోధకులు !

## శ్రీయుత కర్నాటి లింగయ్యగారికి



కృతి స్వీకర్త
శ్రీ కర్నాటి లింగయ్య
యం. ఏ., యం. ఫిల్.

కృతికర్త
శ్రీ నీలా జంగయ్య
యం. ఓ. యల్.

# అర్పణ

" ఇరువదెనిమి దేండ్లుగ నా
ఇష్టపూర్తి కవిత వ్రాసి
వరగుణ పురుషార్థమతుల
క్రమము వెదకి మెచ్చి యిస్తి

అన్నా లింగన్నా ! నీ
వెన్నదగిన వాడవనే
మన్ననతో ఈ నా కృతి
చిన్నది 'కవితా చంద్రిక'

నిన్ను గోరె నామెనింక
అన్నల మిన్నగ జూడగ
ఈ నా బాంధవ్యమింక
ఇగురొత్తుచు ఫలియించగ "

—నీలా జంగయ్య

# కవితా చంద్రిక

శ్రీరామా ! దశరథ తన
యా! రమ్యా! జానకీప్రియా! రఘు తిలకా!
ఘోరాతి ఘోర పాప వి
దూరా! రాక్షసవిరామ! తోయజ నేత్రా!

నాచే విరచితంబగు 'కవితా చంద్రిక' అను నీ గేయ గ్రంథంబు నవలోకించి త్వదీయ దయావిశేషంబును నాపై కొంతచిలికించి ఏ తత్కృతికి పతిత్వము వహించు మిత్రుని అనుగ్రహించి సకల జన కల్యాణ కరంబుగా యందలి భావ వైభవంబును విశ్వ పరివ్యాప్తంబు గావింప వేడుతున్నాను !

## 2

అనుపమాన కవిత్వమును
నిరుపమాన సుందరతను
ఉపమలతో కొలువలేను
ఉల్లేఖన చేయలేను.

అందినంత మటుకు దాని
పొందునంద లేనివాడు
పగల మాట లెన్నొ పల్కి
నగలు దొడిగి తృప్తిచెందు

చేతగానివాని కెప్పుడు
కూత జాస్తి అంటారు
అది మెచ్చిన గాక వెంట
నంటి సాగు వాడెవ్వడు?

అందము తానని [illegible]చ్చర
ఛందము తానై కొల్చిన
సుందరాంగి కేలసొమ్ము
చూడ నామెతో తనియక

ముక్కిడి ముక్కెర గోరుట
మూగ చక్కెరల మెచ్చుట
మమకారమే లేక తనకు
వన్నెచీర కావాలట

3

రాగము జూపని యధరము
రంగును పొందగ జూచును
మేలమాడ లేని వయసు
బేరాలాడగ దలచును

సారహీన విరూపాల
కోరిచూచు వాడెవ్వడు
రసవిహీన కవిత్వాల
పస నరయగ నెంచు నెవడు?

సుందరి గాకున్న దాని
సోకుజూచు వాడెవ్వడు
కమ్మదనము లేకయున్న
గానమెవ్వడభిలషించు

అందమైన దానిలోన
అనురాగము పిక్కటిల్లు
కవితా సౌందర్యంలో
కదలియాడు గుణగణాలు

వాసనలేకున్న పూవు
వలపు జూపలేని తనువు
అందంగాలేని కవిత
కలంకార మేలచాల

అనంగసంగరకేళికి
అడ్డము కానంతవరకె
అలంకారములు దాల్చుట
ఆజంటకు కలుగు సుఖము

సొమ్మే సౌందర్యమన్న
చూచి మెచ్చుదుకాణాల
బొమ్మే సరిపోతె ముద్దు
గుమ్మమాట నెత్తకేంటి

కమ్మని కవితకలంగా
రమ్ము గూర్చు కాలమేది
గుండెగ్రుచ్చు బాణమెచటి
నుండి వచ్చెనను టేమి

గుండెను దోచినది యతివ!
గాయము చేసినది కవిత!
మమతను పంచినది ప్రేమ!
మాయను మాపినది తెలివి!

రసవిహీన కవిత వ్రాసి
రాగమెత్తి పాడనేల
సుందరి గాకున్న దాని
సోకురోకు కను నెవ్వడు

అందము డెందము నంపే
అమృత రూపమున తనరగ
పై మెరుంగు పైపూతకు
పరవశించు వారెవ్వరు ?

సహజ ప్రకృతి విలాసాలు
సరసులలో విచ్చుపూలు
సౌరభాలు – మరందాలు
గౌరవాలు గూర్చు "పూలు"

విధివంచిత జీవలోక
వీధులందు వడగాడ్పులు
యుగయుగాల చరిత్రలో
పొగరాజిన ఏడ్పులు.

అక్రమాలు చేసి ధనా
లార్జించిన పెద్దలు
ఆర్థులకిడకింత మహా
ర్థాభిదులై నిలచిరి

ధర్మపథమునందె పేద
తనమునంది జనముండిరె
ధర్మగతులలోనే శ్రీ
ధరులై వెలయగనెంచిరి

ఆర్థిలేని సమాజాన
అగుపడు నేరీతిదాత
అధర్మమే లేనిచోట
వ్యాఖ్యానించునె ధర్మము

మానవులకు మంచి గూర్చి
మను చట్టాలున్న వేళ
ఘనసంఘాలున్న వేళ
కవులు నోరు విప్పనేల

అనాదిగా జనముతోడ
అవతరించి నారుకవులు
రామాయణ భారతాలు
రాజిల్లెను భూమిమీద

ఏ గ్రంథం ఏ శాస్త్రం
ఏ చట్టం ఏ ధర్మం
బడుగువాని కన్నీళుల
బాధల తెగటార్చగల్గె ?

వేదాలా ? పురాణాలా ?
వాదాలా ? కావ్యాలా ?
అవి అన్నీ ఉన్నవిపుడు ?
అభ్యసించువారున్నరు !

ఏదీ పేదరికము బాప
దేదీ దుఃఖమ్ము దీర్ప
దేదీ మనుగడను చక్క
దిద్దరాదు కానరాదు.

పేద నుద్ధరించుమనే
పెద్ద లెందరో పుట్టిరి
బుద్ధాది మతాలు గలిగె
బుద్దెవరికి కలుగ దాయె.

భూసురు లుదయించినారు
భూధవు లుదయించినారు
చదువుల సాముల నేర్చిరి
వదలనిది దరిద్రమాయె.

మేడ ప్రక్క మేడగట్టు
మేడ పైన మేడగట్టు
వాడుకొనగనే సిమెంటు
ఫ్యాక్టరీలు దుకాణాలు.

కూడు గుడిసె లేనివాడు
రోడు మీద ఉన్నాడు
వాని ఓటు కొనగల్గిన
వానిదె రాజ్యంబాయెను,

అన్నం చిక్కని వారికి
ఆకలి వేసిన వారికి
కళలు కవిత్వాలు మేలు
గలుగ జేయునాడు గదా

కవి రాజ్యం లోన జనం
జ్ఞాన జీవనానందులు
కాగ ప్రపంచాన కవిత
రాగ రక్తిమను గూర్చద.

చెక్కిన రాళ్లతో కట్టిన
చక్కని దేవళము లందు
నిల్పిన ప్రతిమల గొల్చిన
నల్ప జనము లెట్లుందురు ?

నేపుట్టకమున్నులోక
మేపుట్టెను స్వర్ణాన్నము
మెక్కెనన్న కథవింటిని
బుక్కుచుంటి మన్నునేను.

ఏదిక్కున చూడుమంచి
లేదు వంచనల నిండెను
రాదుబుద్ధి నిరుపేదకు
లేదుతెలివి - లేదు కలిమి.

డబ్బు గూర్చుకొన్నవాడు
ధనపతి అవుతాడు
కాగితాన్నికొని చరిత్ర
ఘనతకెక్కుతాడు.

దిక్కుమాలి పేదవాడు
బిక్కమొగం వేసినాడు
పూటకొక్క దాతనామ
మును నుతించుతాడు.

సాహిత్యపు సంఘాల్లో
సరాసరిగచేరి నేడు
రాజపోషకులనుతింప
రాగమాలపించుమింక

డబ్బే డబ్బే సర్వం
డబ్బే సంపాదించుము !
ధనముగల్గు వాని పొగడ
గనుదైవము చేరుచెంత.

దైవపదార్థము ధనమని
ధనమును సమకూర్చుడింక
ఏమైనాగాని దాని
నేగతి విడనాడ రాదు

నిరుపేదా నిరుపేదా!
నీ చేతికి చిప్పవచ్చె
నీచేతికి ఓటువచ్చె
నీవే అధికం బైతివి.

పులి నామంబిడి మేకకు
పులికి మేక పేరుపెట్టి
కైతు రాజు అన్నారు
రాజు బూజు అన్నారు.

కవులమాట విన్న మేక
గంభీరముతో నిలిచెను
మేక పులిని దినెనను నా
జూకు రోజులుదయించెను

పేరు మార్పులోనవచ్చు
పెద్దరికమ్మే లేదు
రాజు పేరుకలిగి యెలుక
రాజు-పోయ్యె రాజున్నది

ఉన్నవాని పేరు బికా
రన్న నేమితరిగిపోయె
లేనివాని నామము దన
వానని పల్కిననేమి?

బికారి నౌకారిగానే
పేరు గాంచుధనవానుడు
అర్థహీనుడన్ని రకా
లనర్థాల పొందుభువిని

అదృష్టం బన్న సూక్తి
నంటి జనము జీవింతురు
చదువు లేనివాడు ఘనా
స్పదముల సంపాదించెను

చదువుకొన్న వారు పెద్ద
చాకిరి చేయుచు నుండిరి
కవిత చెప్ప నేర్వక తా
గ్రంథకర్తయై రచించె

కవిత చెప్ప నేర్చి గ్రంథ
కర్తగాని వారుండిరి
ఇట్లున్నదె గాక లోక
మింకే తీరున కాదో!

ఆకలి కామములు జీవ
లోకమ్మును బట్టి సాగు
దానం గల్గిన ధర్మా
ధర్మములెన్నో కథలై

షడ్రాగములంటి రమ్య
పద్యగేయ కీర్తనలై
నిన్న, నేడు, రేపులలో
ఉన్న కాలమున నిండుచు

వచ్చిపోవు జనావళుల
ఇచ్ఛలలో నిలచి నిల్వ
గలవిగ లేనివిగ నుండు
కాలం కరుణించినట్లు

ఎన్నో ప్రాంతాలు మతము
లెన్నో చట్టాలు భాష
లెన్నో ఆచార కులా
లెన్నో యెన్నో కాంచగ

గాలి నిప్పు నీరు నేల
గగనములందు జనించిన
స్పష్టమైన జీవుల సం
భావనలో చైతన్యము.

తలచిన తీరుల సాగిన
దైవం అవతారాలుగ
విశ్వమెల్ల నిండిపోయె
శశ్వ దఖిల రూపమ్ముల

"ఒకనరు దైవము రాముడు
ఒకనరు దైవము శివుండు
ఒకనరు దైవమ్ము క్రీస్తు
ఒకనరు దైవం అల్లా"

పంచభూతములను, దే
వతలంచును కొలిచే మా
నవులందున మెలిగే దా
నవులకు సైతం దేవుడు

రకరకాల నామాలతో
రకరకాల రూపాలతో
రకరకాల మాటలతో
తనరి ధరణి వెలసినంత

పూజలు వేరై పోయెను
కొలువులు వేరై పోయెను
ఉన్నది పదుగురు మెచ్చగ
అన్నిటికిని విలువలబ్బె

మతము, మాయ, మాట, మంత్ర
మహిమ, యంత్ర తంత్ర తతులు
మనిషి బ్రతుకుతెరువు నెంచి
ప్రబలినవి జగాన మిగుల

విశ్వాసాలందు మెచ్చి
వేష మొకడు గొప్పదనియె
భాష నొకడు గొప్పదనియె
దైవ మొకడు గొప్పదనియె

కథ నొక్కడు మెచ్చె కావ్య
గతి నొక్కడు మెచ్చె రాగ
రసమ నొక్కడు మెచ్చె భావ
సమ్మృత నొక్కడు మెచ్చెను

ఆడ మగల తేడాలవి
అష్టటులై మన జాలెను
అఖిల జనావళి కోర్కెల
కానందము లక్ష్యమయ్యె

చిన్నా పెద్దలుగ మారె
అన్నాదమ్ములుగ సాగె
వావి వరుస లేర్పడియెను
వయో భేద రూపమ్ముల

పుట్టు గిట్టు బాటలలో
కట్టు బొట్టు లేవు గాని
బ్రతుకులందె వెలసె భేద
తతులనంత ధర్మాలై

వివాహాలు రకరకాలు
విచారాలు రకరకాలు
వినోదాలు రకరకాలు
విలాసాలు రకరకాలు

చదువుల పేరున పుట్టిన
శాస్త్రంబులసంఖ్యాకము
మనిషి నొకటిగా జూపని
మాయ, లోకమంత నిండె

తెలిసిన దొక్కింత తెలియ
తెలుపరాదనేడె దాని
గని మౌనము దాల్చె మహా
మునిగ జ్ఞాని జీవించెను

కోరిక కామము దీర్చెను
ఆకలి నన్నము దీర్చెను
నిద్ర బడలికను దీర్చెను
భయము బతుకు నోదార్చెను

ప్రతి ఘటించు విశేషాలు
ఫలాదులై తెలివి పెంచె
మనిషి మనిషిగను చూడని
మనుగడలో మునిగె నరుడు

కవిత నెవడు దర్శించెను
గ్రంథస్థము చేసె నెవడు
బైట బడిన ప్రతిది మాప
వలలో చిక్కినదాయెను

తనకు ముందు జనమున్నది
తనకు వెనకలో నున్నది
తిరిగి తిరిగి ఈ జీవులె
మరల మరల జన్మించగ

కొత్తలు పాతలు జీవుల
కూడిక యీ లోకంబున
నామ రూప భేదాలతొ
నవ రస జీవన మొదవెను

ఆ యమ కాక పేరు లక్ష్మి
ఆ యన నామము నీలయ
కలిసిరి కాపురము సేర
నిలిపిరి సంతానమింత

ఒకరిద్దరుగా జగాన
ఒక కొందరుగా మారగ
ఆ కొందరి మధ్య గలిగె
నాచార విచారమ్ములు

పొదుగు నుంచి పాలు తీసి
పోసిన పాత్రల నిల్చేడు
రీతి శరీరము వచ్చిన
భాతి కులమతాలు నతికి

ఎవరికిడిన పేరు వాని
నెరుగుటకే పరిమితమయి
ఒక రొక్కరి కొక్క పేరు
ఉన్న హెక్కు తక్కు కాదు

వాని పేరు వాని కులము
వాని మతము వాని ప్రాంత
మది భాషా పరమైన మ
ర్యాదలతో తులదూగును

చదువు పేర నొకడు బతికె
సాము పేర నొకడు బతికె
కాయకష్టముల చేయుచు
గడిపిరి బతుకును కొందరు

చావు తప్ప లే దెవరికి
జనమునంటె సుఖ దుఃఖాల్
పరులకంటె తానే గొ
ప్పగ జీవిస్తున్నాననె

18

ఎవని వెఱ్ఱి వానికి ముద
మీయ జాలె నను నానుడి
లోకములో వ్యాప్తి పొంద
రూఢిదేని కబ్బదాయె

పదముల కర్థాలెన్నో
వాడుకొన్న రీతిగల్గె
మాయ మనిషి నావరించె
మనిషి మాయకాడయ్యెను

కథలు చాల సృష్టించెను
వ్యథల చాల ననుభవించె
వెలుగు చీకటుల భ్రాంతులు
వినకన విందై రాజిలె

కోరిక పావని వాడై
తీరిక లేనియు వాడై
తాను మునిగినదె గంగై
తాను మెచ్చినదె రంభై

మనిషి భూమిలో నిండెను
మనుగడ కర్థము గూర్చెను
దశ దిశలను గుర్తించెను
ధర్మగతుల నెలకొల్పెను

కొత్త మనిషి కెపుడు పాత
కొత్తదిగా కనుపించును
పాత వాని కెపుడు కొత్త
ఊత కాగ నడిపించును

గిరగిర తిరిగే చక్రము
తరహా సృష్టి సమస్తము
కొత్త పాత లగుచు వరుని
చిత్రము నలరించుచుండు

ఆకలి కన్నము గావలె
అన్నము కాకలి కావలె
స్త్రీ పురుషుల కామానికి
స్త్రీ పురుషులె తోడవునటు

పని యేదో ఒకటి యెంచు
కొనువాడే లెక్క వేసు
కొనువాడే తీసుకొనును
జడ కొప్పును అల్లి విప్పు

వస్తువు ఒక్కటె కానీ
విస్తరించె బహు రూపుల
కథ అదె అవుగాక కొత్త
గా పదముల మారి పుట్టు

జ్ఞాననేత్ర వికసన మౌ
వానిది జన్మము జన్మము
జ్ఞానహీను మెప్పు గన్న
వాని కర్మ ఖర్మ సుమ్ము

ఎవని బ్రతుకు కథ వానికి
ఇంపు గూర్చినట్లుండును
ఎవని భామ వానికి గు
ఱెందు బింబయై కన్పడు

నాయిక

తన కోరికలో మెదిలే
ఘనుడే ఆయమకు భర్త
తనతో తన జీవిత మను
ధవుడే మెచ్చెడి వనితా

నాయకుడు

తన కెదురెవ్వడు లేడను
ఘనుడే యగు నాయకుండు
తన మదికెక్కినదె గొప్ప
తనము లెన్నొ కలిగిన దగు

శృంగారము

బంగారము నవ్వైమను
సింగారము సిగ్గైమను
సౌందర్యాలెన్నొ పిండి
స్రష్టనామె సృష్టించెను

నడలలోన రాజ హంస
ఒడుపులు దోబూచులాడు
తనూలతిక సుగంధాలి
తాదాత్మ్యతతా నూగను



### యుద్ధము

వంకాయల పోతయ్యకు
టెంకాయల నాసయ్యకు
మధ్యరణము కొనసాగును
మన ఇద్దరిలో నొక్కడు



### ఆయుధము

మంటను మండించు నొకటి
నీటిని ముంకించు నొకటి
ప్రాణుల హతమార్చు నొకటి
ప్రతి శత్రువు దునుము నొకటి



### కరుణము

అగ్నిజ్వాలకు పూవులు
నారగింపు చేయునట్లు
మెత్తని చిత్తమును కరకు
కత్తులతో పొడిచినట్లు

అతికిన హృదయాల రెండు
వెతల పాలు చేయునట్లు
మంచిని తెగటార్చి మూగ
మతి రక్కసి నిలిచినట్లు

వీరము

ఏన్గుల గుంపుల మీదికి
ఎగసి సింగమే దుమికెను
విరోధి మూకల దునుమగ
వీరుడు లఘించె ననును

పాత్రలు ప్రక్రియలు మార్చి
భాష మార్చి ప్రకటించిన
కొత్త పేర్ల గ్రంథాలే
కొత్తలుగా నిండె జగతి

అక్షరాలలో అర్థాల్
అంకెలలో ఆలోచన
చిందులలో వినోదమ్ము
చేర్చిన కథలే కృతులై

అందరి కథ్యయనాలై
అవే మరల మరల పొడమె
అదే గొప్ప తనమందే
అదే మెప్పులను బొందే

ఎవడుగాని తన గొప్పను
ఎంత పెద్ద చేసికొన్న
తప్పుకాదు కాని పరుల
తక్కువగా నెంచతప్పు

సంఘర్షణ సృష్టి సమ
స్తము నోర్వ దొకటి నొకటి
ఇట మంచికి తావులేదు
ఇట సుఖమించుకయు లేదు

ఆశల గుఱ్ఱాల నెక్కి
ఆత్మనె కోల్పోయినారు
అబద్ధాల నాడు వాడె
అందలాల పొంది బతికె

సత్య సంధు లీ భూమిన
హత్య చేయబడిరి దగా
కోరు జనము చరిత్రలో
పేరు పొందినారు ఘనము

నాకు చదువు వద్దు పురా
ణాలు చరిత్రలు కావ్యాల్
నాటకాలు బూటకాలు – నానా
నయ వంచకాలు

జీవుల చిత్తము లెరిగిన
చావుల వర్తనల రసిన
ప్రకృతి వికృతులను చవివెద
బ్రతుకు శ్రమన్ దీర్చుకొనెద

ధర్మ దప్పి బ్రతుక నేర్చి
కర్మలు చేయనివాడే
మర్మజ్ఞుడు జ్ఞాని కదా
మహిని చదువు కొనెనెవ్వడు?

చదివిన దొంగొక్కడయ్యె
చదవని దొంగొక్కడయ్యె
చదివీ చదవని దొంగల
సహవాసము గండము గద

ఓటు నిచ్చు వాడొకడై
సీటు పొందు వాడొకడై
అందెన భాగ్యం బొక్కడు
పొందెనే సౌభాగ్యమొకతు

నడచు ప్రయాణమున నరుడు
వడు దుడుకుల నెన్నొ గడచి
పరుగులెత్తు బండినెక్కి
బస్సు నెక్కి రైలు నెక్కి

తేలిపోవు గగనంలో
గాలి మోటరెక్కి ఒకడు
పడవలోన స్టీమర్‌లో
పయాణించు నొక్కడు

భూజల వాయువు లందు, న
భో మార్గములో నౌకల
రాకెట్టుల సాగి సాగి
ప్రయాణించు నొక్కడు

నరుడు విశ్వ విహారమున
వరలె పుర విరాజితుడై
నరహంతకుడై తానే
ఉరికొయ్యను బొంది చచ్చె

నేనని కదలిన వాడు
నీవును మెచ్చని వాడై
చచ్చు వేళ మృత్యువుతో
పిచ్చి తనది గుర్తించును

నీవని సాగే డొక్కడు
నేనని సాగే డొక్కడు
సాగినంత మేరసాగు
వాగినంత వాగువాడు

మృత్యుంజయుడన్న వాడు
సత్యంబుగ కానరాడు
కీర్తి కాయులైన వారు
కీడు గూర్చువారు కారు

ప్రజాస్వామ్య రాజ్యంలో
ప్రజల మేలు పలుకు మంత్రు
ప్రభుత్వాన నెగడు వారు
ప్రజాధనము మెక్కు మంత్రు

కుల మత భేదా తీతము
గల చట్టము దీర్తురు మె
ప్పుల గాంచగ మత మందిర
ముల కులముల హాస్టళ్ళను

కూర్చు వారు వారై అవి
కోరి మెచ్చు వారై కడు

పేదరికము మాపుదనే
పేర పెద్ద పదవులంది
సిరుల కాట పట్టులైన
పర పతులను గూర్చుకొంద్రు

మార్పు పేర రమణమ్మను
మాధవయ్య అనిపిలుతురు
కని పెంచే పనులలోన
కానుపించవే మార్పులు

గుణము నింత మెచ్చని జన
గణములోన మూర్ఖుండే

గణతంత్ర ప్రజానేతగ
ఘన ప్రశస్తిగొని వరలును

పేదల పేరున సంఘము
పెట్టి పెద్దలైన వారు
చందాలు వసూలు చేసి
సగము ఖర్చు చూపుతారు

లేని వాని నుద్ధరింప
బూని దాన మిత్తురన్న
గని పొందగ లేని వాడ
నని పల్కడె ఉన్న లోభి

అడుగుటలో సగం చచ్చు
నిడలేనన పూర్తి చచ్చు
నడుగు వాడె లేదనిపిం
చెడు పలుకున ఘనుడయ్యెను

అనృత మాడి యాడితినని
అనుటే సత్యం బయ్యెను
చేసిన పని నడుగు వేళ
చెప్ప వెరచుటే చౌర్యం

అని అన లేదనుట కన్న
అఘము మరొక్కటి కలదా

నటన జీవితము కాదని
నాటకాల కని వినండి

ధనరాశి గూర్చువాడు
దాత యెన్నటికి కాడు
ఎవరో మెచ్చు కొనాలని
ఈయ డెప్పుడు దాత ధనము

గుడిలో గుగ్గిలము వేయ
మన్న మానె ...
వేసినంత పని యౌనట
దాని గాంచె నీ సామెత

ధనమద దురహంకారికి
ధర్మము మాట రుచించదు
పది లక్షల పాపము ఒక
పదితో పోవగ దలచును

పర ధన కాంతానందుడు
స్వంతముండి లేనివాడు
హీనజేయగోరి పరుల
తానె ముందు హీను డగును

ఆవు నేయికేల ? డాల్డ
కవసరమ్ము ప్రచారమ్ము!

మంచి వాని కెందుకు నుతి
కొంచె పోసికే కావలె

ఎవడో కని మెచ్చాలని
ఈశు భజన చేయుటేల
తాను తరించగ దలచియు
తనలో తానీశు దలచు

సతికి పతియు వంట నెంచి
సన్మానము చేయ నామె
పలికె తాను చేసికొనిన
వంటయెనీకింత బెడితి

ప్రజా సేవ చేయువాడు
భజంత్రీలు వాయించడు
కరిచే కుక్కెప్పుడేని
మొరగ దన్న సామెతుంది

కృతి భర్తయు తన సతి కడ
సతికిల బడి యున్నప్పుడు
పురుష సింహమను కర్తను
అరసి మూతి విరిచె తరుణి

సేవా సంఘాలు పెట్టి
మేవామెక్కే పెద్దలు

డబ్బిచ్చిన దాతలనే
ఉక్కిరి చేయగ చూతురు

ధనము వడ్డికిచ్చి వడ్డి
ధనము దానమిడడు దాత
ఆర్తి పరులకొరకు కడుగడు
ఆతడు దర్తి కానోపడు

ఆత్మజ్ఞాన ధనాఢ్యులు
అజ్ఞానుల ధ్వని నణగిరి
కంచు వోలె మ్రోగదు బం
గారము కాల్చిన తరగదు

ఒకనినొకడు దోచుకొనని
తికమకలేని వ్యవస్థను
తీర్చిదిద్దనోపు నెవడు
దేవునకే సాధ్యపడదు.

ఒక్కడు ఉత్తరము సాగగ
ఒక్కడు దక్షణముసాగు
ఎవనికి వాడే వ్యవస్థ
ఎవనికి వాడే ప్రభువు.

మాయకాని మాట వెన్న
మంచివాని మాట నిప్పు

వెన్న నంటుకొన్న బతుకు
వెరచుకదా నిప్పు నంట.

ప్రజావసరముల దీర్చే
పనులందే ధనము లందు
వారి నెంచి గీతమల్లె
ప్రజాకవి ప్రజాసేవగ.

పండుగరాకను తెలిసీ
పద్యాలల్లే కవులు
ప్రచార సంస్థాధిపతుల
పట్టి కవితలల్లువారు.

పైకమెంచి పెండ్లి పద్య
పంచకాల వ్రాయువారు
కవిమేళపు దుకాణాలు
కమ్మని బిరుదుల నమ్మును.

పొరుగింటీ పుల్లకూర
వరరుచికరమని మెచ్చే
నరులు తల్లిదండ్రు లిడిన
నామమువిడి గొనిరెబిరుదు

పరాధికారము తలపై
పడవేసుక తిరుగ చెడును

తనకు చేతగాని అట్టి
పనుల చేయబూన రాదు

దైవము తోడై నిల్వక
తన ఘనతలు ఫలియించవు
ఉపాయాన కూర్చదగిన
సహాయాల చిక్కకుండు

బుద్ధిబలము చెంత నిలువ
బూన జాలవే బలాలు
హితవచనం వినని వాడు
హీనగతిని పొంది చచ్చు.

మూర్ఖుల సరిజేతుననే
బుద్ధిమంతు డిల దొరకడు
పనులకు కీడెంచువాడు
బాధలంది చదకు చచ్చు.

పరవంచకు లెప్పుడు శ్రే
యశమును దల్చక వెదుకద
నీతిహీనుడైన వాని
జాతిహీనుడే మెచ్చుతు.

చెప్పేదే చేయనీతి
చేసినదే చెప్పరీతి

మనుషులంత ఒకజాతి
మంచి గూర్చ దవిసేతి.

ప్రకృతియే మహావిదాత
ప్రకృతి ననుసరించు సుకృతి
ప్రకృతిలోనగల సర్వ
స్వము జీవారాధనమగు.

కళారాధనమున శుభం
కరమూర్తిగ వెలుగు నపుడు
జడ జగత్తు ఆతని కర
స్పర్శతో విరాజిల్లును.

గత కాలపు కావ్య కథల
నుతిగను నేర్పున మార్పున
వర్తమానమున కనువుగ
పరివర్తన చేయువారు

బ్రతుకులందు నికృష్టులు
పాత్రలందు మహోన్నతులు
ఐనవారు కానివారు
అంతయు తామైనవారు

నిరపాయంబుగ విద్యల
పరమోపాయముగ మార్చి

ధరాజీవన ప్రగతికి
ఫిరాయింపు చూపింతురు.

సాసంగం తనకు లాభ
పరిధిగ భాసింపజాలు
భజనపరుల నే మెచ్చి
భగవంతులుగా జూతురు.

ఎంగిలి గుర్తించకున్న
మంగళకరమే సర్వము
పరార్జితము వీలగుగతి
స్వార్జితముగ మెచ్చుకొనే

బలవంతుల దగాకోరు
పాలనమున బడుగువారు
అమాయకులు నలుగారుట
కాశ్చర్యం పడగనేల.

గురుపాదయుగమ్ము నంటు
వరకే వరభక్తులైతే
పరమాత్మను సంస్మరించు
భక్తుల గుర్తించిరెవరు.

చతుష్షష్టి కళలు ధనా
ర్జనమునకే పరిమితమై

ధరా జీవనమున పరా
త్పరుని తలుపజాలవయ్యె

వచ్చు బత్తలయ్యె పుట్ట
వలసి వచ్చె పోవు వేళ
బత్తలైన జీవులలో
బట్టనంటి నాడు నరుడు

భాషలు బట్టలు వ్రాతలు
పట్టి నిలచె నర జీవుల
పలు రకాల శాస్త్ర ధర్మ
ములు గానవి విరాజిల్లె

మర్మము - ధర్మము - కర్మము
మనుగడలో చోటు చేసు
కొనె విశ్వామిత్ర సృష్టి
గుణ భాసితమై జగమున

ప్రకృతి ధర్మమది యంత
ర్భావముగా నిలచి పోయె
వికృత రూప భౌతికార్థ
విజ్ఞానమె సాగి పోయె

శత వర్షాయుః ప్రమాణ
యుతుడై బరగే నరుడిల

లి ప్త కాలమున క్షేమగు
లీల తెలియకున్న వాడు

ఆతని సతి చిన్నదయ్యె
అరువ దేండ్లు తనకు రాగ
షష్ట్యబ్దోత్సవము జరిపి
సన్యాసిగ బ్రతక డాయె.

స ప్తతి వర్షోత్సవమ్ము
సాగించుకొనంగ జూచు
ఎక్కువేండ్లు సంసారము
నేలిన వానిగ మురియును.

పది నూరేండ్లుగ బ్రతికే
పాముకు లేదుత్సవమ్ము
చిరకాలము కావుమనుచు
అరచే కాకికి లేదు

కడునిల పురుషార్థపరుడు
కాక నెవ్వడెన్నేండ్లుగ
ఉన్నా లేకున్నా ధర
కొరిగెనేమి వానివలన.

ఆది శంకరాచార్యుం
డవనిని బ్రతికెన్ని వత్స

రాలు వివేకానందుడు
బ్రతికెన్నాళ్ళో తెలియుము !

దయానంద భారతి భూ
తలమున నెన్నేండ్లు బ్రతికె
బ్రతికిన పోతన్న తీరు
బ్రతికిన త్యాగయ్య వోలె.

పౌరుష జ్ఞానాగ్ని యశః
ప్రభార్జనము చేయ బ్రతుకు
గాంధిమహాత్మునికి వత్తు
గడవపూటకున్న చాలు.

అన్నదాన సప్తాహమ
హా యజ్ఞము జరుపజూచు
వాడు దాహమనుచు వచ్చు
వానికి నీళ్ళీయనపుడు.

ఎన్నుబెట్టు వానిని నా
కెంతమాత్రముం దోచదు
దానము నడిగిన వానికె
దయతో నీయగ జూతుము.

దానమడుగ వచ్చువాడె
దాతగ నిను నిల్పుగోరు

ఆడుగువాడు సామాన్యుం
డని యెంచక నిచ్చువాడె

మహాదాతగా నెంచుము
మహాదాత బలి యొక్కడె
బలిగాకిల దాత నామ
మిల నేగతి బొందలేరు.

పిలిచి పిల్లనిత్తునన్న
కులము లేత యని పల్కిన
పగిది దానమిత్తునన్న
పల్చ బడడె దాత ధరణి

గుప్త దాన మడుగు వారి
కోరి చేయ నెంచువాడె
గుణ ధనుడని కర్ణునట్లు
మనును దాత నామమ్మున

తనయుని బ్రతికించుకొనగ
దానమడిగె దేవేంద్రుడు
దానవ సంహారార్థము
దాన మడిగె విష్ణుమూర్తి

ధర్మ గుణాఢ్యుండు గాక
దానము చేయుట సాధ్యమె

మనిషి ఘనుడు గాక దాన
మహిమ తెలియజాలకుండు

సహకార, సహాయాలే
సామాన్యులు నా చరిత్రు
అదే చాలు కలి వేళ మ
హా దాన మటంచు నెంచు

మంచి కొంచెమైనా పూ
జించి పెంచుకొనవలె, నా
ర్జించినంతలో పరులకు
పంచ నెరుగు టదె శుభమ్ము

'హృదయ శైలి, కవిత్వాన
మెదలిన పేరని తలచితి
మిత్రులైన వారికి ప
విత్ర గతిని వినిపించితి

తన భార్య పతివ్రత యని
కొనియాడగ దలచువాడు
పరభామల గోరునెట్లు ?
వరమతి దుర్మతి యగునా ?

తనదగు వస్తువు నెప్పుడు
ఘనమైన దటంచు నెంచు

40 — II

మనుజుని నైజమునందే
మను పరవస్తువు నిరసన.

వ్యక్తి వ్యక్తికంటె బలా
బలములు భేదాల నిలుపు
వస్తురూప నామమ్ముల
విస్తరించు నందాలు.

ఈనా కవితా చంద్రిక
కింపు పెంపు వికసిల్లగ
మంగళమై తెలుగుతల్లి
కింగళహారమ్ము కాగ.

సంపూర్ణము